# గ్రామ సమాచారములు

## సోమవరముపేట రైతుల లబలబలు

[విలేఖరి]

ఇది యొక జాగీరు గ్రామము. మెదకుజిల్లాలోని ఎల్లారెడ్డిపేట తాలూకాలో నున్నది. జాగీర్దారుగారు నగరనివాసి, మిర్జా మహమ్మదు హుసేను బహాదురు ౧౩౪౫ ఫసలీలో ఈగ్రామపు రైతులు, జాగీర్దారు రైతులను ఇబ్బందిపెట్టుచున్నాడనియు, తరీభూములలో బిగముగకి ఆబీ౫౦, తాబీ౪౫, చెరుకుకు౨౦౦ రూపాయలు బలవంతముగా వసూలుచేసికొనుచున్నారనియు మాల్గుజారీ మోతెమదు క్రొత్తజాగీరుదారగారి వద్ద దరఖాస్తుయిచ్చుకొనిరి. దానిపైన క్రొత్తసుగారు రైతులపైన దయబూని, జాగీరుదారును ఈవిషయములో సమాధానము చెప్పుమని హుకుముయిచ్చిరి. జాగీర్దారుగారు ఈ సంగతి ముందుగనే గ్రహించి తామ గ్రామము బందోబస్తు చేయించ సిద్ధముగా నున్నారనియు, పైన చెప్పినవరలు పూర్వమునుంచి రైతులు రాజీనామా ప్రకారము ఇచ్చుచున్నారనియు, రైతులలో కొందరు తక్కువవారిని లేవనెత్తి ప్రోత్సహించుచున్నారు గాని రైతులకు బాధలు లేవనియు సమాధానముగా దరఖాస్తు వ్రాసిరి. క్రొత్తసగారు జాగీరుగ్రామమును వెంటనే బందోబస్తు చేయించవలసినదనియు, జాగీర్దారు బందోబస్తు పూర్తియగువరకు ధారలు పెంచవద్దనియు, బందోబస్తుయిచ్చుట రైతులు పగను, జాగీర్దారు పగను పెట్టుకొనవలయుననియు హుకుం జారీ చేయుచు, జాగీర్దారు ఆబీకిస్తు రైతులుయిచ్చుటలేదని షికాయతు చేయుచున్నాడు కనుక తాలూకావారు వసూలు చేయించి యియ్యవలసినదని ఆజ్ఞాపించిరి.

రైతులు దీనిపై మరల మొరపెట్టుకొనిరి. ఇంత హెచ్చుధారలు జిల్లాలో ఎక్కడాలేవు, మేము యియ్యజాలము, తగ్గింపుడని ప్రార్థించిరి. దయామయులగు క్రొత్తసగారు జాగీర్దారును పిలిపించిరి. గవాబహదూర్ వాడు ఇరుపక్షముల వారి ఐనానువినిరి. కుదరుపాటును యీప్రకారము జారీచేయించిరి.

(౧) గ్రామబందోబస్తు త్వరగా చేయవలెను.
(౨) బందోబస్తు పూర్తి యగుటకు చాలకాలము కావలెను కనుక ఈలోగా సర్వేపైమాయిషుల్యాదలు రకొడ్డువారు చేయవలెను.
(౩) ధారాలు, ఆబీకి౨౦, దుఫసలాకు ౩౦, చెరుకుకు ౫౦ మాత్రముండవలెను.

జాగీర్దారుగారు ఈఆజ్ఞ కొంచపవలయునని దొరగారితో ఎన్నో సంగతులు చెప్పిరి. తన గ్రామములో భూమి బిగములనగా రెండున్నరఎకరములుండును కనుక హెచ్చుధరయము తీసుకొనుచున్నాననిరి. రైతులకు చాలా అనుకూలము చేయుచున్నాననిరి. కామబీల్జాజడీ ఉద్యోగముననున్నాననికూడ వివరపరచిరి.

కాని కస్టడారుపులగు దొరగారు ఈమాటలు వినలేదు. రైతులు కూడ అసంగతులు లబద్ధములనియు, విచారణచేసి యథార్థము కనుగొనవచ్చుననియు చెప్పిరి.

మోతెమదుగారిఆజ్ఞ రైతులకు సంతోషము కలిగించినది. లేనిచో వారుచాల కష్టముల పాలయ్యెడివారు. ఇతరజాగీర్లప్రజలు తమకుగలిగిన కొయ్యల క్రొత్తసగారికి మొరపెట్టుకొని న్యాయము పొందరాదా? ఏలకలదు జాగీరు ప్రజలారా! మేలుకొనుడు!!

---

## జాగీరులో వైద్యశాల నిర్మాణము

గుల్బర్గాజిల్లాలోని అలంద గ్రామములో వైద్యశాలకట్టించుటకు ౪౦౦౦౦ రూ. మంజూరి గావించబడినది. అలంద నవాబు సుల్తానల్ముల్కుగారి జాగీరులోనిది.

## మెదకుసుబా తపాల కచేరీమార్పు

సంగారెడ్డిలోనున్న మెదకుసుబా తపాలాముహాతమీనుకచేరి ఈఅరంజాను నెలఫులలోనే హైదరాబాదు రానున్నదని తెలియుచున్నది. కాని, మెదక్కు సంబంధించిన కచేరీలు సంగారెడ్డిలోనున్నందున్నయు, మెదకునకే మార్చబడునని తెలియుచున్నది. ఆట్టితరి అన్నిటితోబాటు ఈకచేరీనికూడా మెదకునకే మార్చిన బాగుండును. అంతవరకు సంగారెడ్డిలోనే ఉండుట సమంజసము. లేకున్న మార్పులో వృథావ్యయమగును అని ఒకరు సూచించుచున్నారు.

## వేరుశనగలు బలవర్ధకాహారము

వేరుశనగలు మానవుని ముఖ్యాహారములలో శ్రేష్ఠమైనది. ఇది మనదేశమున విస్తారముగా పెరుగును. ఇందు నగము పాలునూనె యుండుటచేఅతిసులభముగా జీర్ణముగావు. వీనిఒలిచిని గానుగఆడి నూనెతీసిన తర్వాత కానుగపిండినిసనిన బాగుగ జీర్ణించును. ఇందులో మాంసకృత్తులు ఎక్కువ. ఇది సోయాబీనులకంటెను చాలశ్రేష్ఠము. చాలా పుష్టినిచ్చును. దీనిని విశేషముగా తినినచో పిత్తము చేయునని భయపడుదురు. కాని దీనితోకూడ కొద్ది బెల్లముగాని, లేక సాధారణకొర్పును గాని చేర్చిన ఓత్తములుగదు. దీనిని సరిగా వేచ్చిచేసి మూతగల పాత్రలో భద్రపరచిన చాలకాలము చెడిపోకుండును. దీనిని పిండివంటలు చేయుటకును, ఇతర కూరలతో కలుపుటకు నుపయోగింపవచ్చును. అని ప్రొఫెసర్ డి. ఎల్. సహస్రబుద్ధిగారు సూచించిరి.

---



## లక్నో కాంగ్రెసుకు హైద్రాబాదు ప్రతినిధులు

హైదరాబాదు కాంగ్రెసుకమిటీ కార్యదర్శి శ్రీయుత అంతూ రామచంద్రరావు గారిట్లు వ్రాయుచున్నారు:—

౭ జనవరి ౧౯౩౬ (౫ ఇస్ఫందార్ ౧౩౪౫ ఫ.) మంగళవారము నాడు సాయంత్రము ౫ గంటలవేళ, గౌలిగూడెములోని శ్రీయుత వామనరావుగారి ఇంటిలో, లక్నో కాంగ్రెసు కువెళ్లు ప్రతినిధులయెన్నిక జరుపుటకై కాంగ్రెసుసభ్యుల సమావేశము జరుగును.

కాంగ్రెసు నియమముల ప్రకారము, సభాసదుల సంఖ్యనుబట్టి హైదరాబాదు కాంగ్రెసు కమిటీపక్షమున ఒక ప్రతినిధిమాత్రము ఎన్నుకొనుటకు వీలుకలదు.

ప్రతినిధిగా వెళ్లదలచినవారు తమ దరఖాస్తును ౬ జనవరి ౧౯౩౬ (౪ ఇస్ఫందార్ ౧౩౪౫ ఫ.)నాడు సాయంత్రము ౫ గంటలవరకు జాంబాగులోనున్న కార్యదర్శియింటిలోగల కాంగ్రెసు కార్యస్థానమున దాఖలు చేయవచ్చును.

ఈసభలో నిర్ణీతమైన సంవత్సరచందా చెల్లించి రిజిస్టరులో పేరు చేర్పించుకొనిన సభాసదులు మాత్రమే పాల్గొనవచ్చును.

## ఇల్లుకట్టుచోట గోరీలేదు

హైద్రాబాదు, దూదుబావులిలో ఒకఇల్లు కట్టుచుండగా గోరీకనిపించినదని ప్రకటింపబడియుండెను. అదిసత్యముగాదు. కొన్ని ఎముకలుమాత్రమే యుల్పడగా వైద్యశాలకు పంపబడెను. అచట అవిఎముకలు, మానవేతర లవని నిరూపింపబడినవని ఇంటి యజమానియగు వెంకటస్వాములుగారు తెలుపుచున్నారు.

## దక్కన్ మోటారుసర్వీసుకు మరి రెండేండ్లు గుత్తా

హైదరాబాదు మెదకు మధ్య మోటారుసర్వీసు మొనాపలి దక్కన్ మోటారు సర్వీసువారికి యుండెనుగదా. అందు. రెండుసంవత్సరములు హెచ్చింపబడినవని తెలియుచున్నది. మొనాపలి(గుత్తా)ముగియగానే ప్రభుత్వంవారి బస్సులు నడుచుననియు—వానివల్ల ఎన్నియో సౌకర్యములుండుననియు తలంచుచుండిరి. వారికి ఆశాభంగము కలిగినది.

ఉస్మానియా మెడికల్ కాలేజి అంత్యసంవత్సర విద్యార్థులబట్టు డిచుపల్లిలోని కుష్ఠురోగ విద్యాలయమునకు, అనుభవార్జనమునకై ౫ జనవరికి పోగనున్నది.

## టాస్కరుగారి దౌరా

రాయచూరు జిల్లాలోని గంగావతికి టాస్కరుగారు (భూవ్యాదాయశాఖా మంత్రులు) పోగాపై పోగనున్నారు. అచట ఒకవారముకోజులు మకాముచేసెదరు, అందుకై సూబేదారుగారు, అవ్వలు, దువ్వంతాలూక్దార్లు తహసీల్దార్లందరు గంగావతికివచ్చి తీవ్రముగా సన్నాహములు గావించుచున్నారు. డాక్టరుగారు తమ స్టాఫుతోవచ్చి స్థలనిర్ణయము చేసియున్నారు. యానినిగుట్ట ప్రాంతమున మంచిపీటి ఒసరిగలచోటులో డేరాలు, రావటీలు వేయబడినవి. చుట్టు తోటలు నాటబడుచున్నవి. చుట్టుచుట్టు చౌకీలనిర్మించి గట్టికాపలా గాయబడుచున్నవి. నిర్మాణశాఖవారు రాజమార్గములను అతిశీఘ్రముగా నిర్మించు ప్రయత్నములో నున్నారు. ఇటులనియు తిరుగుటలో పటేలు, పట్వారీలు, చప్రాసీలు అలసిపోవుచున్నారు.

---

